# భారతీయ తత్త్వశాస్త్రము

[డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణపండితుని
'ఇండియన్ ఫిలాసఫీ' అను ఆంగ్లగ్రంథమునకు
ఆంధ్రానువాదము]

## చతుర్థభాగము

అనువాదకులు:
విద్వాన్ బులుసు వేంకటేశ్వరులు, ఎం. ఏ.,




ప్రచురణ:
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
1990

BHARATI



By

Vidwan Bulusu Venkateswarlu, M.A.

*Edited by* :

Mudivarti Kondamacharyulu.

T. T. D. Religious Publication Series No. 358

*January* . 1990

*Copies:* 5000

*Published by* :

Sri Ch. Venkatapathi Raju, I.A.S.,

Executive Officer,

T. T. Devasthanams,

Tirupati.



*Printed at* :

Tirumala Tirupati Devasthanams Press,

Tirupati - 517 507

# ముందుమాట



డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణ రచించిన భారతీయ తత్త్వశాస్త్ర చరిత్ర విశ్వవిఖ్యాతిపొందిన గ్రంథం. ఆంగ్లభాషలో ఉన్న ఆ ఉద్గ్రంథాన్ని పాశ్చాత్యులు పలువురు ప్రాచ్యవిద్వాంసులూ ప్రాచీనభారతీయ వేదాంత దర్శనాలకూ ఆర్షసంస్కృతికీ సంబంధించిన ప్రామాణిక రచనగా ప్రశంసించారు.

భారతీయ వేదాంత దర్శనాలను పాశ్చాత్యులకు అర్థమయ్యే శైలిలో సుదీర్ఘరపు సొంపుతో సుకుమార సుందరంగా అందించడమే ఆంగ్లవిద్యాకోవిదుడైన రాధాకృష్ణ మనీషి ప్రత్యేకత. గంగానిర్ఝరిణి లాంటి ఆంగ్లపద గుంఫనంతో, నయాగరా జలపాత సదృశమైన వక్తృత్వముతో ఆయన ప్రతీచీ సాంస్కృతిక జగత్తుకు సనాతన భారతీయ వేదాంత తత్త్వచరిత్ర వినిపించారు.

ప్రాచ్యప్రతీచీ విద్వాంసులు రాధాకృష్ణ పండితుని ప్రతిభకు కర్పూర నీరాజనాలు సమర్పించారు. హృదయంగమమైన ఆయన కృతులకు ప్రపంచ మంతటా స్వాగతసత్కారాలూ, గౌరవ ప్రపత్తులూ లభించాయి.

ఆంగ్లభాషలో రాధాకృష్ణ పండితుడు రచించిన ఆ మహోత్తమ గ్రంథాన్ని తెలుగులోనికి అనువదించడానికి భగీరథ తపస్సు అవసరం. అనువాదకునకు ఆంగ్లభాషావైదుష్యమూ, తెలుగులో మంచి రచనా పాటవమూ, సనాతన భారతీయ వేదాంత దర్శనాలలో సాంగోపాంగమూ సర్వతోముఖమూ అయిన ప్రవేశమూ ఉండాలి. ఈ అన్ని అధికార ములూ ఉన్న శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు దీక్షతో ఈ గ్రంథాన్ని రెండు దశాబ్దాలకు పూర్వమే అనువదించారు. వీరి ఆంధ్రానువాదానికి కేంద్రసాహిత్య అకాడమీ వారి జాతీయ బహుమతి లభించింది. ఇలాంటి

ఉత్తమ గ్రంథాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం వారు ప్రకటించగలిగి నందుకు సంతోషిస్తున్నాము.

తొలి మూడు సంపుటాలవలెనే నేడు వెలువడుతున్న ఈ నాల్గవ సంపుటముకూడా ఆంధ్రపాఠకలోకము యొక్క ఆదరాభిమానాలు చూరగొన గలదనీ సాంస్కృతిక వికాసానికి దోహదంచేయుగలదనీ మా ప్రగాఢ విశ్వాసం.

సి. హెచ్. వేంకటపతిరాజు,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

తిరుపతి,
20–1–1990.



# విషయసూచిక

## చతుర్థాధ్యాయము

### సాంఖ్యతత్త్వము


౧ ఉపోద్ఘాతము 1
౨ సాంఖ్య పూర్వగాథ 3
౩ సారస్వతము 9
౪ కారణధర్మము 14
౫ ప్రకృతి 16
౬ గుణములు 21
౭ పరిణామము 26
౮ దేశకాలములు 40
౯ పురుషుడు 43
౧౦ జీవాత్మ 48
౧౧ ప్రకృతి పురుషులు 53
౧౨ పురుషుడు – బుద్ధి 58
౧౩ జ్ఞానసామగ్రి 60
౧౪ జ్ఞానాధారములు 65
౧౫ సాంఖ్యజ్ఞాన సిద్ధాంతము 70
౧౬ ధర్మశాస్త్రము 75
౧౭ మోక్షము 81
౧౮ మరణానంతర జీవితము 85
౧౯ సాంఖ్యము నాస్తికతత్త్వమా ? 87
౨౦ సామాన్య పరిశీలనము 92


## పంచమాధ్యాయము

### పతంజలి – యోగతత్త్వము


౧ ఉపక్రమణిక 111
౨ పూర్వచరిత్ర 114

౩ కాలము, సారస్వతము 117
౪ సాంఖ్యము – యోగము 119
౫ మనస్తత్త్వ సిద్ధాంతము 123
౬ ప్రమాణములు 129
౭ యోగకళ 131
౮ ధర్మానుష్ఠాన సిద్ధి 133
౯ శరీర శిక్షణము 135
౧౦ ప్రాణాయామము 137
౧౧ ఇంద్రియ నిగ్రహము 138
౧౨ ధ్యానము 139
౧౩ సమాధి 139
౧౪ మోక్షము 145
౧౫ కర్మ 148
౧౬ అతీంద్రియ శక్తులు 149
౧౭ భగవంతుఁడు 153
౧౮ ఉపసంహారము 157

## షష్ఠాధ్యాయము

## పూర్వమీమాంస

౧ ఉపోద్ఘాతము 159
౨ కాలము – సారస్వతము 161
౩ ప్రమాణములు 165
౪ ప్రత్యక్షము 167
౫ అనుమానము 175
౬ శ్రుతిప్రమాణము 177
౭ ఉపమానము 184
౮ అర్థాపత్తి 184

౯ అనుపలబ్ధి 185
౧౦ ప్రభాకరుని జ్ఞానసిద్ధాంతము 186
౧౧ కుమారిలుని జ్ఞానసిద్ధాంతము 192
౧౨ జీవాత్మ 201
౧౩ యథార్థ జగత్స్వరూపము 209
౧౪ ధర్మశాస్త్రము 213
౧౫ అపూర్వము 217
౧౬ మోక్షము 219
౧౭ ఈశ్వరుఁడు 221


## సప్తమాధ్యాయము

### వేదాంత సూత్రములు


౧ ఉపోద్ఘాతము 229
౨ గ్రంథకర్తృత్వము — కాలము 232
౩ శాఖాంతర సంబంధము 234
౪ తాత్త్విక భావములు 235
౫ ముగింపు 247


## అష్టమాధ్యాయము

### శంకరాద్వైతవేదాంతము


౧ ఆరంభ వచనము 249
౨ శంకరుని జీవితము — కాలము 251
౩ సారస్వతము 257
౪ గౌడపాదుఁడు 259

౫ వ్యావహారిక జ్ఞానపరిశీలనము
౬ సృష్టి
౭ ధర్మశాస్త్రము, మతము
౮ గౌడపాదుఁడు – బౌద్ధమతము
౯ భర్తృహరి
౧౦ భర్తృ ప్రపంచము
౧౧ శంకరుని కుపనిషద్బ్రహ్మసూత్ర సంబంధము
౧౨ శంకరుఁడు – శాఖాంతరములు
౧౩ ఆత్మ
౧౪ జ్ఞానసాధన సామగ్రి
౧౫ ప్రత్యక్షము
౧౬ అనుమానము
౧౭ శబ్దప్రమాణము
౧౮ విజ్ఞానవాద నిరసనము
౧౯ సత్యనిర్ణయ లక్షణము
౨౦ వ్యావహారిక జ్ఞానలోపము



ఓం

# భారతీయతత్త్వశాస్త్రము

## చతుర్థాధ్యాయము

### సాంఖ్యతత్త్వము

#### ౧ – ఉపోద్ఘాతము

విజ్ఞానముయొక్క సాంప్రదాయికమార్గమునఁబడు విధానమున కొక యడుగు ముందుకుఁ బెట్టినదే సాంఖ్యతత్త్వము. అవిచ్ఛిన్నతా సూత్రోద్ఘాటనమువలన నీ తత్త్వము కొంతవఱకు జగత్స్వరూపమును వరస్పరసంబంధములేని పదార్థములను విడిపోట్లముల గట్టి చూపు విధానమునకు స్వస్తిచెప్పినది. క్లిష్టము ప్రవాహరూపమునైన సృష్టి కర్థము చెప్పు విషయములో న్యాయవైశేషికు లుపయోగించిన, స్థాయిరూపము దాల్చిన, పదార్థసిద్ధాంతము నవలఁద్రోసి, అణునానాత్వ సిద్ధాంతమును వెనుకవిడిచి, సాంఖ్యతత్త్వము చెప్పఁదగిన పురోగమన మొనర్చినది. సృష్టిస్థానమునఁ బరిణామము నుంచి, ప్రకృత్యతీత మతమూలాధారము అను గొంత యిది సడలించివేసినది. పరమేశ్వరుఁడు తన యేకైక సంకల్ప క్రియామూలమున విశ్వసృష్టిని గల్పించెనను భావము నిది నిరసించెను; అనంతజీవకోటికిని, నిత్యక్రియాశీలమగు ప్రకృతికి నన్యోన్యసంపర్కముచే, ననఁగా ప్లేటో వాక్యములలో "సర్వజీవ వరంపరలకును నిలయమును మాతృస్వరూపమునైన"[౧] ప్రకృతిసంపర్కముచే జగ ముదయించెనని యిది నిర్ణయించెను.

---

౧) మఱియుఁజూడుః ఎనీడ్స్. ౪, ౬, ౧౩: ౩.టీ, మెకెన్నావాల్యూము: ౨ పుట ౭౬

ద్రష్టృదృశ్య భేదముతోఁగూడిన విజ్ఞానలక్షణము ననుసరించి, పురుషులు, ప్రకృతియు యథార్థములని సాంఖ్యతత్త్వ మూహించినది. జ్ఞేయమగు వస్తువు, తెలియు జీవియు నున్నవని నమ్మకున్నచో మన యనుభవమున కర్థమే యుండదు. మన యనుభవ మెందుకున్నది; యెట్లున్నది మున్నగు విషయములఁగూర్చి వివేకవిలసితమగు విజ్ఞానము నొసఁగుటకు సాంఖ్యము యత్నించినది. సాంఖ్యతత్త్వమునుగూర్చి ప్రత్యేకకృషిచేసిన రిచార్డు గార్బే యిట్లు నుడివినాఁడు; "ప్రపంచ చరిత్రమందు మొట్టమొదటిసారి కపిలసిద్ధాంతములో మానవ మానసముయొక్క సంపూర్ణస్వాతంత్ర్యమును, స్వీయసామర్థ్యమం దఖండ విశ్వాసమును ప్రదర్శింపఁబడినవి." ౧. "భారతవర్షమున నుదయించిన విజ్ఞానరాశిలో నిది యత్యంత భావవిశిష్టతగల తత్త్వశాస్త్రమని చెప్పవచ్చును." ౨. దీనియందుఁ గొంతవఱ కతిశయోక్తిగలదని తలఁచువారైనను, పరిశుద్ధ తత్త్వశాస్త్ర వికాసములో నిదియొక విఖ్యాత పరిణతియని యంగీకరింపవచ్చును.

సిద్ధాంతరూపమైన పరిశీలనమువలన నిర్ణయములు చేయ సమకట్టిన కారణముచే నిది సాంఖ్యశాస్త్ర మను నామమును గాంచినది. సంఖ్యాశబ్దభవమే సాంఖ్యమనియు, ౩. జగత్స్వరూపమును గొన్ని సంఖ్యలుగల తత్త్వములుగా విభాగించి చెప్పుటచే నీ నామము సముచితమై యున్నదనియుఁ గొందఱు భావించిరి. కాని యీ పరిగణన విధాన మొక్క సాంఖ్యమునకేకాక సర్వ హిందూతత్త్వములకును సామాన్యలక్షణమై యున్నది. పురాతన గ్రంథములలో 'సంఖ్య' యనఁగాఁ దత్త్వవిచారమనియే కాని, విషయపరిగణన మను నర్థములో

౧) ఫిలాసఫీ ఆఫ్ ఏన్షెంట్ ఇండియా॥ పు ౬౦. మఱియుఁ జూడు దేవీస్॥ పు ౫.

౨) సాంఖ్యప్రవచనసూత్రము: పు ౧౪.

౩) గార్బే: ఫిలాసఫీ ఆఫ్ ఏన్షెంట్ ఇండియా: పు ౪. మహాభారతము సాంఖ్యమును పరిసంఖ్యాన మనెను, చూ: ౧౨, ౧౧౩౯–౩: ౧౨, ౧౧౪౦౯: ౧౧౪౧౦. వింటర్నిట్జ్ చెప్పినాఁడు: "పైథాగరస్ భారతీయ సాంఖ్యతత్త్వప్రభావము ననుసరించెను." కలకత్తా రివ్యూ: ౧౯౨౪, పు ౨౧)

నుపయోగింపఁబడలేదు.౧. పురుషునియొక్కయుఁ దదితర తత్త్వముల యొక్కయు, స్వరూపమును ౨. సమ్యక్పరిశీలనముచే నీ తత్త్వము వివరించును గాన దీని కీ నామము సముచితమైయున్నది.౩.

## ౨ - సాంఖ్యపూర్వగాథ.

విజ్ఞానచరిత్రమందుఁ బూర్తిగా నూతనమైన విషయముండదు. సర్వతోముఖమైన యొక విజ్ఞానతత్త్వ మే యొక మానవుని ప్రత్యేక ప్రజ్ఞనుండియు నుదయింపదు. ఒక నూత్నసిద్ధాంతమును నిర్మించుటకుఁ దత్కర్తకు వలయు భావసామగ్రి తత్పూర్వమే వ్యాప్తిగాంచియుండవలెను. ఋగ్వేదమునందు సృష్టిక్రమమును వివరించుసందర్భములో సాంఖ్యప్రకృతిపురుష సిద్ధాంత సూచనలను గొన్నిటి నుదాహరించియుంటిమి. మన ముపనిషత్తులకు వచ్చునప్పటి కందు వివిధోపదేశములలో సాంఖ్యతత్త్వ ప్రధానభావము లన్నియు గోచరించును. ఉపనిషత్కర్త లందరు నొకే రీతి నూహించియుండలేదు. కొందరు, తాము నిర్మింపకున్నను; సాంఖ్యతత్త్వ నిర్మాణమునకు వలయు భావములను బ్రకటించియున్నారు. తన కుపనిషత్తులే యాధారమని సాంఖ్యతత్త్వము చెప్పుకొనుటలో, సాంఖ్యద్వైతమున కుపనిషన్మతము పూర్తిగా విరుద్ధమైనను, గొంత యాధారము లేకపోలేదు. ఉపనిషత్తులలోని ప్రకృతినిగూర్చిన భావములు సాంఖ్యతత్త్వమున నధికప్రాముఖ్య

---

(౧) పోల్చు: మ॥భా॥ ౧౨ ౧౧౯౩౪.

"దోషాణాం చ గుణానాం చ ప్రమాణం ప్రవిభాగతః,
కంచిదర్థ మభిప్రేత్య సా సంఖ్యే త్యుపధార్యతామ్ ॥"

ఒక యర్థనిర్ణయము చేయునప్పుడు గుణదోష పరిగణనము చేయుటయే సంఖ్యయని చెప్పవచ్చును. సంఖ్యయనఁగా నెప్పుడును బరిగణనార్థమునే చెప్పరాదు. విష్ణుసహస్రనామ భాష్యములో శంకరుఁడు "శుద్ధాత్మ తత్త్వ విజ్ఞానం సాంఖ్యమిత్యభిధీయతే", యను వాక్యము నుదాహరించినాఁడు. చూ: హాల్, సాంఖ్యసారము పు ౫.

౨) సమ్యగ్వివేకే నాత్మకథనమ్ ॥

౩) శంఖుఁడను మూలపురుషుని వలన సాంఖ్యమను నామ మేర్పడె నని తలపఁబడెను; కాని దీని కాధారములేదు, చూ: హాల్, సాంఖ్యసారము. పు౩.

మును గాంచినవి. మొదటిసారి సాంఖ్య శబ్దమును శ్వేతాశ్వతరము ౧. స్మరించినది; కాని సాంఖ్యతత్త్వములోని భిన్నాంశములుమాత్ర మితరములగు నుపనిషత్తులలో నున్నవి. పునర్జన్మభావము! ఇహలోక మసంతృప్తిహేతువను తలంపునుగాక, మోక్షమునకు జ్ఞానమే సాధనము, పురుషుఁడే శుద్ధద్రష్ట మున్నగు ప్రధాన నియమావళియు నుపనిషత్తుల నుండియే గ్రహింపఁబడెను. ౨. కఠోపనిషత్తునందు ౩. జడ జగత్పరిణామ పరంపర కగ్రస్థానము నాక్రమించినది 'అవ్యక్తము'; దాని నుండియే మహదాత్మయు, బుద్ధి, మనస్సు, ఇంద్రియములు, వస్తువులు క్రమముగా నుదయించినవి, అహంకారము సంగతి లేదు. పరమాత్మ విషయము గలదు. సాంఖ్య తత్త్వజ్ఞులు తా ముపయోగించిన భావములలో నివియే ప్రాచీనతమములు, ప్రకృతి ప్రథమసంతానము మహత్తు; ప్రళయానంతరము సృష్టి కారంభమునందు, మూలప్రకృతి పదార్థమ్మును ౪. సృజించినవెనుక పరమాత్మ ప్రథమజుఁడుగాఁ దన్ను దానే సృజించుకొను నను నుపనిషద్భావమే యిది. మనఃప్రవృత్తి వర్గీకరణము ప్రశ్నోపనిషత్తు నందలి జాగ్రత్స్వప్న సుషుప్త్యాద్యవస్థల ననుసరించి గ్రహింపఁబడి యుండనగును. ౫. సృష్టిక్రమమును గూర్చిన సాంఖ్యభావములకంటె నధికవికాసమందిన భావములు శ్వేతాశ్వతరోపనిషత్తునందుఁ ౬. గలవు. కాని సాంఖ్యగుణత్రయము మున్నగు సూత్రములన్నియు నుపనిషత్తులో ద్వైతతత్త్వమున కనుబంధముగాఁ జేయఁబడినవి. ప్రధానమునకును మాయకును, పరబ్రహ్మకును పురుషునకు నం దభేదము చెప్పఁబడెను. ౭. బుద్ధునితరువాత యుగమునకుఁజెందిన

---

౧) ౬, ౧౩.

౨) బృ। అ॥ ఉ॥ ౨,౪,౧౪:౩,౪,౨:౪,౫, ౧౫; ముండక ఉ। ౩, ౧,౧.

౩) ౩, ౧౦-౧౧,౬,౭-౧౧. [illegible] ఛాం.ఉ.౬,౮,౬.

౪) రా॥ వే॥ ౧౦,౧౨౧ [illegible] మ॥ భా॥ ౧౨, ౩౧౧, ౭.

౫) ౪౮. [illegible]. సాంఖ్యుల సూక్ష్మశరీరమును నీ యుపనిషత్తులోఁజెప్పిన షోడశకళాన్వితుఁడగు పురుషునితో.

౬) చూ॥ శ్వే॥ ఆ॥ ఉ। ౧,౪:౪,౫.

౭) ౧,౧౦: ౪,౩,౧౨: ౪౧.

మైత్రాయణ్యుపనిషత్తు,౧. విశేషాభివృద్ధినొందిన సాంఖ్యతత్త్వ పరిచయముగలిగి, తన్మాత్రలను,౨. మూఁడుగుణములను,౩. ప్రకృతి పురుషభేదమును వివరించియుండెను.౪. ఈ శబ్దముల నన్నిటిని సామాన్యార్థమందును, నిశ్చితార్థ రహితముగను నుపనిషత్తులుపయోగించినవి; అనంతర తత్త్వములు వీనికి స్థిరములగు నర్థసిద్ధాంతకల్పనము చేసినవి. ఒక పూర్వభౌతికమతశాఖనుండి పెంపొందినదే సాంఖ్యతత్త్వమని చెప్పిన జాకొబీభావమున కాధారము లేదు. ఆత్మసర్వస్వతంత్రమైనది, పరిపూర్ణ వాస్తవికతకలది యని నిర్ణయించుటచే, మానసికవ్యాపారములకు భౌతికార్థములను జెప్పు నాస్తికవాదులకు సాంఖ్యము శాశ్వతముగా వ్యతిరేకమని రుజువుచేసుకొన్నది. సాంఖ్యతత్త్వవికాసమున నే ఘట్టమందును దానికి భౌతికవాద సంపర్కమున్నట్లు సాక్ష్యము లేదు.

సాంఖ్యమునకుఁ బ్రాచీన బౌద్ధముతోఁగల సంబంధము ననుసరించి, పరస్పరభావ సంగ్రహణము శంకింపఁబడినది. మనకు నేఁడు లభించు సాంఖ్యగ్రంథములు బౌద్ధమతారంభమున కనంతరకాలమునుండి వచ్చినవేయైనను, బౌద్ధమతసిద్ధాంతముల ప్రభావ సంపర్కము గొంత యున్నను, సాంఖ్యభావములుమాత్రము బుద్ధునిపూర్వ౫. యుగ

౧) చూ॥ కీత్: సాంఖ్యము, పుటలు ౧౪-౧౫ నృసింహతాపనీయ గర్భ, చూళికోపనిషత్తులు విశేషముగా సాంఖ్యసిద్ధాంతమును ననుసరించినవి.

౨) ౫, ౨; ఛాం॥ ఉ॥ ౬, ౩.

౩) ౨, ౫; ఛాందోగ్యోపనిషత్తునందును, శ్వేతాశ్వతరోపనిషత్తు నందును జెప్పఁబడిన త్రివర్ణముల ననుసరించి గుణత్రయసాంఖ్యసిద్ధాంతము కల్పితమని కొందరు చెప్పుదురు.

౪) ౬, ౧౦, పోల్చు. కీత్ "వివరములలో సాంఖ్యమందున్నదెల్ల నుపనిషత్తులలో నెచటనో యొకచోట నున్నది."(సాంఖ్యము పు ౬౦౪)

౫) '' బుద్ధునికిఁ బూర్వమందే సాంఖ్యయోగతత్త్వములు వ్యాప్తిలో నున్నవనుటకమోఘములగు నాధారము లపరిమితములుగా హిందూబౌద్ధ గ్రంథములలోఁ గలవు" (రాజేంద్రలాల్‌మైత్రా: యోగసూత్రములు. పు ౧౬) చూ. గార్బె: సాంఖ్యప్రవచన సూత్రవృత్తి. పు. ౫, పోల్చు బ్రహ్మజాలసూత్రము:" సోదరులారా: నిత్యత్వవాదులైన సన్న్యాసులును బ్రాహ్మణులును గలరు: ఆత్మయు జగత్తును సత్యము లని వారు నానాగాధారములను జూపిరి. వీరు తర్కవాదాభ్యాసపరులై, వారి యుక్తిప్రయుక్తులతోగూడిన వాద

మునకుఁ జెందినవేయనియు, సాంఖ్యతత్త్వమున కాధారము బౌద్ధతత్త్వము కాదనియుఁ జెప్పవలసియున్నది. దుఃఖము జీవితమందు నిశ్చయమనునదియు, వైదికకర్మకలాపమునకుఁ బ్రాముఖ్యము తగ్గుటయుఁ, గ్రూరతపోవిధాననిరసనమును, ఆస్తికభావము విషయముతో నుదాసీనతయుఁ బరిణామనిత్యత్వమును బౌద్ధసాంఖ్యములకు సమానములు. ఈ సమానభావతాటస్థ్యము పరస్పరభావ స్వీకృతికి సాక్ష్యము కాఁజాలదు; మరియు ముఖ్యములైనవిభేదములును గలవు. సాంఖ్యమతమునకుఁ గేంద్రసిద్ధాంతములైన, ప్రవృత్తిరహితుఁడైన పురుషుఁడు అవ్యక్తప్రకృతి, గుణత్రయము మున్నగువానిలో దేనిని బౌద్ధ మంగీకరింపదు. బౌద్ధనిమిత్తధర్మమునకును సాంఖ్యపరిణామ వాదమునకును బోలికలున్నచో దానికిఁ గారణము రెండింటికి మూలాధారము ఉపనిషత్తు లగుటయే. బుద్ధుని కాలమందలి సాంఖ్యము నాస్తికమగునో కాదో మనకుఁ జెప్పుట కాధారములు లేవు.

మహాభారతమునందు సాంఖ్యతత్త్వ సామ్యముగల భావసంపుటి స్పష్టముగా వర్ణింపఁబడియున్నది. పురుషప్రకృతి భేదమును 'అనుగీత' వివరించినది. ౧. ప్రకృతితత్త్వములైన యిరువదినాలుగును ద్రష్టయైన పురుషునికి విషయములు, పురుషుఁ డిరువదియైదవతత్త్వము. ౨. ప్రకృతి పురుషులకుఁగల మూలభేదములను గుర్తించుటవలన మోక్షము సిద్ధించును. ౩. జీవనానాత్వము వ్యావహారికము. ప్రకృతిసంబంధమున్నంతకాలము జీవు లనేకములు. ప్రకృతికిఁ దమకుఁ గల భేదజ్ఞానమును బొందుటతో జీవు లిరువదియాఱవతత్త్వమగు నీశ్వరునియందుఁ జేరుదురు. ౪. పురాణేతిహాసతత్త్వము ప్రధానముగా ఆస్తికము; అందుఁ

చర్చలవలన నీ నిర్ణయములను బ్రకటించిరి. ఆత్మ శాశ్వతమైనది; నూతనోత్పత్తికిఁ గారణముగాక, ప్రపంచ మొక సుస్థిరమైన పర్వత శిఖరమువలెను, సుస్థాపితమైన స్తంభమువలెను నచలమైయున్నది. ఇఁక నీ జీవు లన్నియు, జన్మపరంపరావశములై యున్నను, భిన్నావస్థలలోఁ బతనోత్పతనములఁగలిగి, శాశ్వతములై వర్తించుచుండును."

౧) ౧౪, ౨౦.

౨) మ॥ భా॥ ౧౨, ౩౦౬ ౩౯-౪౦,

౩) ౧౨, ౩౦౮, ౨౦.

౪) ౧౨. ౩౫౦, ౨౫, ౨౬; ౧౨ ౩౫౯, ౨౬.

గల సాంఖ్యభావము లన్నియు 'ఆస్తికత'ను సమర్థించుట కుపయోగింపఁ బడెను. సాలెపురుగునుండి దారము ఉత్పత్తియగురీతిని, ఆత్మనుండి గుణము లుత్పన్నము లగుచుండును. ౧. పురుషాధీనమై ప్రకృతి తన వ్యాపారములఁ జేయుచున్నది. ౨. ప్రకృతి, పురుషసంజాత మనియు, నది తిరిగి తిరిగి, యందుఁ బ్రవేశించుచుండుననియుఁ జెప్పఁబడెను. ౩. మహదహంకారమానసములు పరమపురుషుని విశ్వజగత్ప్రవృత్తులు. సంప్రదాయము ననుసరించి, సాంఖ్యతత్త్వ ప్రవక్తయగు కపిలుఁడు పురాతన బ్రహ్మర్షివరేణ్యుఁడని వాకొనఁబడెను. తరువాతఁ దానుగాంచిన విస్పష్టమైన యాకృతి, పురాణయుగమునందైనను సాంఖ్యమునకు లేదని స్పష్టము. ఏలనఁ బురాణములలోఁ దన్మాత్రప్రశంస లేదు. తత్త్వముల భిన్న వికాసరీతులనుగూర్చి భిన్నభావములు చెప్పఁబడినవి. అనుగీత లోని సాంఖ్యతత్త్వవర్ణనము మూలసాంఖ్యతత్త్వమున కించుమించుగా సరిపోవునట్టి యత్యంతసన్నిహితత్త్వమును గలిగియున్నది. ౪. పంచ శిఖునియొక్కయు ౫. అసితదేవలుని ౬. యొక్కయు భావములు చెప్పఁబడినవి. 'ఆసురి' సాంఖ్యమును పంచశిఖునికిఁ జెప్పెనని యున్నది. ఈ విషయము సాంఖ్యకారికలోఁ బునరుక్తమైయున్నది. ఆసురియు, బంచశిఖుండును 'ఆస్తిక' సాంఖ్యమును బ్రకటించి, పర బ్రహ్మ పరిపూర్ణ సత్యస్వరూపియని విశ్వసించిరి. జీవాత్మయొక్క స్వాతంత్ర్యము పరిచ్ఛిన్నమైనది. పంచశిఖుని భావములకును, సాంఖ్య తత్త్వభావములకును ముఖ్యములగు భేదములు వివరములలోఁ గలవు. ౭.

---

౧) ౧౨, ౨౭౪౫-౪౦.

౨) ౧౨, ౩౭౪, ౧౨, ౩౧౫, ౮.

౩) ౧౨, ౩౦౩, ౩౭.

౪) ౧౪, ౪౦-౪౨.

౫) ౧౬. ౨౭౯: ౧౨, ౫౨౭, ౯౬-౧౭౨.

౬) ౧౨, ౨౭౪.

౭) ఆరవ యింద్రియమైన మనస్సునకుఁ బ్రతిగా శక్తియే ఆరవ కర్మేంద్రియ మని యాతఁడు తలఁచినాఁడు. ౧౨, ౨౧౯ లోని వర్ణనమునకును ౧౨౩-౨౧౨, ౯౬-౧౧౨. లోని వర్ణనమునకును భేద మున్నది. పంచశిఖుఁడు ముప్పది నియమముల నంగీకరించెనని

మనువు, సాంఖ్యమును నామముతో స్మరింపకున్నను, ప్రథమాధ్యాయమ్ములో నిచ్చిన సృష్టిక్రమమును, ప్రమాణత్రయము[౧] నంగీకరించుటయు, గుణత్రయ వివరవర్ణనమును[౨] సాంఖ్యప్రభావమును జూపును. పురాణములును,[౩] అనంతర వేదాంత గ్రంథములును సాంఖ్య సిద్ధాంతముల నుపయోగించు కొనెనుగాని, నాస్తిక తత్త్వమును మాత్రము స్వీకరింపలేదు. సాంఖ్యతత్త్వ కాలనిర్ణయమున కివి నిరుపయోగములు.

ఉపనిషత్తులందును, మహాభారతము, భగవద్గీత మను స్మృతులందును గల సాంఖ్యభావము లాస్తికములు.[౪] పురుషుండును,

---

చెప్పఁబడెను. ఇది ప్రాచీనరూపమైన పంచశిఖుని తత్త్వమని చెప్పుదురు. శాస్త్రకర్తయైన పంచశిఖుఁడును, పురాణములోని పంచశిఖుఁడు నొకఁడో కాఁడో తెలియదు. ఏలన మహాభారత పంచశిఖుని భావములకును, సాంఖ్యయోగ తత్త్వములోని పంచశిఖుని భావములకును విశేష భేదము లున్నవి. చరకాచార్యు నాయుర్వేద శాస్త్రమునుండి పంచశిఖుని భావములను ప్రొఫెసర్ దాసుగుప్తఁ డుదాహరించినాఁడు. కాని యందుఁదన్మాత్ర ప్రశంస లేదు. ప్రకృతి పురుష లవ్యక్తమని చెప్పఁబడెను. పురుషుఁడు ప్రవృత్తిరహితుఁడును గాఁడు: మోక్ష మనఁగా బ్రహ్మైక్యము. అందుచే నీ భావములకు సాంఖ్య మెంతయాధారమో, వేదాంత న్యాయవైశేషిక, బౌద్ధముల నంత యాధారములే యని చెప్పనగును.

౧) ౧౨, ౧౦౫.

౨) ౨౨. ౨౪-౯౨.

౩) భాగవతము ౩, ౨౫ మత్స్యపురాణము ౩ అ॥ అగ్నిపురాణము ౧౭ అ: మార్కండేయ పురాణము ౧౪.

౪) మహాభారతాది ప్రాచీనగ్రంథములను బరిశీలించిన వెనుక నీశ్వరునం దవిశ్వాసముగల వాక్య మొక్కటియు సాంఖ్యమునుగూర్చి చెప్పునది కన్పట్టలేదు" (ఫ్రాంక్లిన్ ఎడ్గెర్టన్. అమెరికన్ జర్నల్ ఆఫ్ ఫైలాలజీ, ౧౪,౨ పుటలు.) దేవుఁడు లేఁడను సాంఖ్యమునకును ద్వైతాస్తిత్వమును జెప్పు యోగమునకును భేదము నగ్గడించినదని మ॥భా॥ ౧౨,౧౧౦౪౫. చెప్పఁబడినది. ఎడ్గెర్టన్ ఈభావమును ఖండించినాఁడు. కాని ౨౪ తత్త్వములను జెప్పిన సాంఖ్యమునకును, ౨౫ తత్త్వములనుజెప్పిన సాంఖ్యమునకును భేదమును జెప్పిన మ॥ భా॥ వాక్యములను త్రోసిపుచ్చుట సాధ్యము కాదు. రెండవ సాంఖ్యము ద్వైతమునుగూర్చి యుదాసీనత చూపును. (౧౨. ౯౦౦) కాని మ: భా. నిరీశ్వర సాంఖ్యము నంగీకరింప దన్నమాట నిజమే.

బ్రకృతియు స్వతంత్ర తత్త్వములుగావు; అవి యీశ్వరుని భిన్నరూపములు, అశ్వఘోషుని బుద్ధచరితమందు, ఆస్తికసాంఖ్యభావములు గల బుద్ధుని పూర్వగురువైన 'అరాడు'నితో బుద్ధుని సమావేశము వర్ణింపఁబడినది. పురాతన సాంఖ్యతత్త్వ ముపనిషత్తులకుఁ జెందిన విశిష్టాద్వైతముతో సాదృశ్యముగల వాస్తవికాస్తికత్వమని చెప్పుటకుఁ బ్రబలాధారము లున్నవి. ఇట్టి సాంఖ్య ముపనిషద్భావానుగుణ్య మని చెప్పవీలగును గాని, పురుషనానాత్వమును, ప్రకృతిస్వతంత్రతను ప్రతిపాదించి, పరమపురుష ప్రశంసను సంపూర్ణముగా విడిచిన సాంఖ్యము నట్లు చెప్పరాదు. సాంఖ్యతత్త్వము తృప్తికరమైన దగుటకు వలయు పరమపురుషభావము నెట్లు సాంఖ్యము విడువ గలిగిన దనునది ప్రశ్న. బౌద్ధమతారంభకాలమువరకును సాంఖ్యమొక విశిష్టవ్యాప్తి గాంచినతత్త్వముగా వికసించి యుండలేదు. బాహ్యప్రపంచము నిజము గాదని బౌద్ధులు నిశ్చయప్రకటన చేయఁగాఁ బ్రకృతిపురుషులు యథార్థాస్తిత్వము గలవని, హేతువిధానముచే సాంఖ్యతత్త్వము నిరూపించి, బౌద్ధవాదము నెదుర్కొనెను. కేవల హేతువాదముపై నాధారపడవలసివచ్చిన సందర్భములో ద్వైవాస్తిత్వమును నిరూపించు హేతుసామగ్రి లేదని చెప్పవలసి వచ్చినది.

## ౩—సారస్వతము.

అన్ని సంప్రదాయములు సాంఖ్యతత్త్వప్రవక్త కపిలుఁడని యంగీకరించినది.౧ అతఁడు బ్రహ్మపుత్రుఁడని కొందఱును,౨ విష్ణ్వవతార౩ మని కొందఱును, మఱికొంద రగ్ని దేవత౪ యొక్క యవతారమనియుఁ జెప్పుదురు. ఇవన్నియుఁ బురాణగాథలు; ఒకటి మాత్రము

౧. శ్వే. అ. ఉ. ౫-౨, పోల్చు. మ॥భా॥ మోక్షధర్మము:

సాంఖ్యస్య వక్తా కపిలో పరమర్షిః పురాతనః।

హిరణ్యగర్భో యోగస్య వక్తా నాన్యః పురాతనః॥

౨. మ॥భా॥ ౧౨, ౩౪౦. ౬౭; రామాయణము ౧, ౪౭.

౩. భాగవతము ౩, ౧౪, ౩౬; ౨, ౬౫:

౪. సాం. ప్ర. భా. ౬, ౬౧.

నిశ్చయము; కపిలుఁ డను నొక చారిత్రక పురుషుఁ డుండి యుండె ననియు సాంఖ్యతత్త్వము నాతఁడు కల్పించె ననియుఁ జెప్పనగును. బుద్ధునికిఁ ౧ పూర్వశతాబ్ది మాతని కాలమనుటలో విశేషవ్యత్యాసము లేదు. కపిలుఁడు రచించెనని తలఁపఁబడు సాంఖ్య ప్రవచనసూత్రమును; తత్త్వ సమాసము నాతఁడు రచించె ననుట కాధారము లెవ్వియును లేవు. ఈశ్వర కృష్ణుఁడు తన కారికలోఁ దాను కపిలశిష్య పరంపరలో ఆసురి, పంచ శిఖుఁడు మున్నగువారి వెనుకవచ్చిన వానిఁగాఁ జెప్పుకొనును. ౨ ఈ యాసురి శతపథబ్రాహ్మణములోని అసురియే యైనచో, క్రీ. పూ. 600 ప్రాంతమువాఁడై యుండవలెను. పంచశిఖుఁడు క్రీ. వె. ప్రథమశతాబ్ది మునకుఁ జెందియుండవచ్చునని గార్బె భావించెను. మనకు లభించిన యల్పవాక్యసాక్ష్యములనుబట్టి, యాతఁడు గుణత్రయ సిద్ధాంతమును విశ్వసించెనని తెలియుచున్నది. పురుషులు ౩ అణుపరిమాణముగల వారని నమ్మి, ప్రకృతిపురుష సంబంధమునకుఁ గారణము కర్మ కాక అజ్ఞాన మని నిశ్చయించెను. ౪.

ఈశ్వరకృష్ణుని సాంఖ్యకారిక మనకు లభించినవానిలోఁ బ్రాచీన మైనదియు, సుప్రసిద్ధిగాంచినట్టియు శాస్త్రగ్రంథము. ౫ దీనినామమును బట్టియే యిది ప్రథమగ్రంథముకాదని స్పష్టము. వార్షగణుఁ డనువాని గ్రంథమును వింధ్యవాసుఁడు తిరిగి రచించె నని యొక చైనాసంప్ర

---

౧) సత్వతత్త్వములలో సాంఖ్యము ప్రాచీనతమమైనదని వింటరుపండితు నభిప్రాయమైయున్నది. (హిస్టరీ ఆఫ్ ఇండియన్ లిటరేచర్ పుట ౨౩౫) సాంఖ్యయోగము లతి సనాతనములైనవని మ॥భా॥ చెప్పును, సనాతనసే ద్వే. ౧౨. ౧౩౭౧౧.

౨) సాం. కా. ౭౦ మ॥భా॥ ననుసరించి (౧౨. ౨౧౮. ౧౪-౧౫) కపిలు ననుసరించినవారు, అసురి. పంచశిఖుఁడు, గార్గ్యుఁడు, ఉలూకుఁడు చైనాసంప్రదాయము ననుసరించి, యొకపంచశిఖి కణాదశిష్యుఁడు, ఇతఁడు పంచశిఖుఁడుగాఁడని స్పష్టము. చూ. యుఐ, వైశేషిక ఫిలాసఫీ. పు ౭౦౮, మ॥భా॥లో జనకపంచశిఖ సంవాద మొకటి గలదు. కొన్ని యాతని భావములు యోగభాష్యములో నుదాహృతములు.

౩) సాం॥ ప్ర॥ భా॥ ౧, ౧౨౩

౪) యో॥ భా॥ ౧, ౩౬.

౫) సాం॥ ప్ర॥ భా॥ ౬, ౬౮.

దాయము చెప్పుచున్నది. కారికా గ్రంథకర్తయే ౧ వింధ్యవాసుఁడైనచో మనకుఁ దెలియని యొక పూర్వగ్రంథాధారముచేఁ గారిక రచింపఁబడెనని చెప్పవలెను. ౨ అది క్రీ. వె. తృతీయశతాబ్దమునకుఁ జెందిన గ్రంథము. ౩.

గౌడపాదుఁ డీ కారికపై నొక భాష్యమును రచించెను. మాండూక్యోపనిషత్తుపైఁ గారిక రచించిన గౌడపాదుఁ డీతఁడగునో కాదో శంకింపవలసియున్నది; ఏలన, రెంటిభావములకు భేదము విశేషముగా నున్నది.

---

౧) వింధ్యవాసినామ మీశ్వరకృష్ణుని గౌరవనామ మని తకాకుసువు చెప్పెను. (జె. ఆర్. ఎ. యస్. ౧౯౦౫) గుణరత్నుఁడని భిన్ననామములని భావించెను. (తర్కరహస్య దీపికా॥ పు ౧౦౨, ౧౦౪.)

౨) సాంఖ్యశాస్త్రములోఁ గొంతభాగమే మనకు లభించె ననియు కాలవశమునఁ గాల ప్లుతమైనదనియు భాగవతము చెప్పినది. సాంఖ్యగ్రంథము లనేకములు కాలగర్భమున నశించినవని విజ్ఞానభిక్షువు చెప్పెను. (సాంఖ్యప్రవచన భాష్యము, ఉపోద్ఘాతము) సాంఖ్య కారికలోని చివరశ్లోక మిట్లున్నది. ' ఈ డెబ్బదిశ్లోకములలోను షష్టితంత్ర మంతయుఁ జెప్పఁబడినది. ఇం దుపాఖ్యానములును, వివాదవిషయములును విడువఁబడినవి " ఈ శ్లోకము ప్రక్షిప్తమని స్పష్టము; ఏలన దీని ప్రథమ భాష్యకారుఁడైన గౌడపాదాచార్యుఁ డీ శ్లోకమును స్మరింపలేదు. గుణరత్నుఁడు షష్టితంత్రోద్ధారకుని స్మరించెను. ఆసురి దీనిని వ్యాప్తికిఁ దెచ్చెనఁట. పంచశిఖుఁడు దీనిని నాస్తిక మొనర్చి, కపిలునికిఁ గర్తృత్వ మాపాదించెను. కాని వీనినిగూర్చి స్పష్టముగా నేమియుఁ జెప్పఁజాలము. షష్టితంత్ర మనఁగా నొక గ్రంథము కాదనియు నరువది విషయముల ప్రణాళిక యనియు వాచస్పతియు, నారాయణుఁడును జెప్పినారు. జైనుల అనుయోగద్వార సూత్రమునఁ జెప్పఁబడిన షష్టితంత్రమునకు నిదియే యర్థము కాదగును. అహిర్బుధ్న్య సంహిత ననుసరించి (౧౨అ) సాంఖ్యము ౬౦ విభాగములు గల ఆస్తిక గ్రంథమనియు, ప్రకృతినిగూర్చి ౩౨ భాగములు, వికృతినిగూర్చి ౨౮ భాగములును నున్నవనియుఁ జెప్పఁబడెను. తన తత్త్వకౌముదిలో (పు ౩౨) వాచస్పతి రాజవార్తికమునుండి యొక వాక్యము నుదాహరించెను. ప్రకృతి, దాని యేకత్వము, దానికిఁ బురుషునికి భేదము మున్నగు నరువది విషయములనుగూర్చి చెప్పుటచే నది షష్టితంత్రమని పిలువఁబడెనని యిందుఁజెప్పఁబడెను. షష్టితంత్రకర్త పంచశిఖుఁడని యొక చైనా సంప్రదాయము; వార్షగణ్యుఁడని మఱి కొందఱుచెప్పిరి చూ: భామతి ౨,౧,౪

౩. పరమార్థుఁడను బౌద్ధసన్యాసి (క్రీ. వె. ౬వ శతాబ్దము.) దీనిని చైనాభాషలోని కనువదించి, దానికొకభాష్యము వ్రాసినాఁడు. కారికనుండి రెండవశ్లోకము నుదా

అతఁడు వాచస్పతికిఁ బూర్వుఁడు గావున క్రీ. శ. ౮ వ శతాబ్దమునకుఁ జెందినవాఁడు కావచ్చును. ౧. వాచస్పతి వ్రాసిన సాంఖ్యతత్త్వకౌముది (క్రీ. శ. ౯ వ శతాబ్దము) యొక్క సువిదితగ్రంథము. నారాయణుని సాంఖ్యచంద్రిక గౌడపాద భాష్యముపై నొక వృత్తియై యున్నది.

కపిల కృతమని ౨ చెప్పఁబడిన సాంఖ్యప్రవచనసూత్ర మధ్యాయషట్కముగలది. మొదటి మూఁడధ్యాయములును సాంఖ్య సిద్ధాంతములను వివరించును; చతుర్థమునందు సూత్రములను వ్యక్తీకరించు నుపాఖ్యానములుగలవు; పంచమాధ్యాయము విమర్శాఖండనములు గలది; షష్ఠాధ్యాయము విషయసంగ్రహ పునరుద్ఘాటనముతో నుపసంహ

---

హరించిన వసుబంధునికి వింధ్యవాసి పూర్వుఁడని చైనా సంప్రదాయము. చూ. యుఇ, వైశేషికఫిలాసఫీ. కీత్ చెప్పునట్లు వింధ్యవాసుఁడు కారికాకర్తయో (సాంఖ్యము, పు. ౭౦; జె.యల్.ఎ.పు. ౨౪౫: కర్మమీమాంసా. పుట౫౫.) లేక బెల్వాల్కర్ చెప్పునట్లు భాష్యకారుఁడో (భండార్కర్ కమ్మెమొరేషన్ వాల్యూము, పు. ౧౭౫-౧౭౮.) తెలియదు. కాని, ఈశ్వర కృష్ణుఁడు క్రీ. శ. ౪-వ శతాబ్దమునకుఁజెందిన వసుబంధునికిఁ బూర్వుఁడు కాళిదాసే యీశ్వర కృష్ణుఁడని, స్వప్నేశ్వరు డనినాఁడు. "ఈశ్వరకృష్ణనామ్నా కాళిదాసేనకృతాః కారికాః." చూడు హాల్ విరచిత సాంఖ్యసారము పు. ౨౫. ఈశ్వర కృష్ణుఁడు నాస్తికవాది యని స్పష్టముగాఁ జెప్పవచ్చును. కారికలో ౭౦ శ్లోకములుగలవని చెప్పఁబడినను మనకు లభించినవి ౬౯ మాత్రమే. సాంఖ్యకారిక, ౬౧ పై గౌడపాద భాష్యము ననుసరించి, పోయిన శ్లోకము నిట్లు కల్పింప తిలక్పండితుఁడు యత్నించినాఁడు:

"కారణం ఈశ్వరమేకే బ్రువతే కాలం పరే స్వభావం వా,
ప్రజాః కథం నిర్గుణతో వ్యక్తః కాలస్వభావశ్చ".

గౌడపాదభాష్యమున కిట్టి శ్లోకము మూలమైయుండనోపును. కాని నాస్తిక భావము నుగ్గడించెను గాన నణఁచివేయఁబడి యుండవచ్చును.

౧) సాంఖ్యకారికనుగూర్చి రచితమైనది మాఠరవృత్తి: గౌడపాదుని భాష్యము దీని సంగ్రహమేయని చెప్పఁబడెను. కాని సామాన్యముగా మొదట భాష్యమును తరువాత వృత్తియు వచ్చుచుండును. సాంఖ్యకారికలోని చివరి మూఁడుశ్లోకములపై వ్యాఖ్యచేసిన కారణముచే మాఠరవృత్తి భాష్యానంతర విరచితమే. చూః భండార్కరు కమ్మెమొరేషను వాల్యూము.

౨) తన కౌముదీప్రభలో స్వప్నేశ్వరుఁడు సాం॥ ప్ర॥ సూ॥ పంచశిఖునదనియుఁ గపిలుఁడు దానిని వ్యాప్తికి దెచ్చెననియుఁ జెప్పెను. చూ. హాల్॥ సాంఖ్యసారము. పు ౮.

రము చేయును. మాధవుని సర్వదర్శనసంగ్రహము దీనిని స్మరింప మియు, సాంఖ్యకారికపైఁ గల దన భావముల నాధారముచేసి చెప్పుటయు నీ కారణములచే నిది క్రీ. వె. ౧౪-వ శతాబ్దమునకుఁ జెందినదని చెప్పు చున్నారు. ౨. కారిక కేవలద్వైతమును వివరింపగా, ద్వైతాస్తిత్వము నెడ మాత్రము కొంత సౌమ్యభావమును ప్రకటించెను. అనిరుద్ధుని సాంఖ్యసూత్రవృత్తి ౧౫ వ శతాబ్దమునకును, మహాదేవుని సాంఖ్యసూత్ర వృత్తి సారము ౧౬ వ శతాబ్దమునకును, జెందినవనిచెప్పవచ్చును. నాగే శుని లఘుసాంఖ్యసూత్రవృత్తికిఁ బ్రాధాన్యము లేదు. సాంఖ్యప్రవచన సూత్రమునకు విజ్ఞానభిక్షు విరచితమైన సాంఖ్యప్రవచన భాష్యము (క్రీ.వె. ౧౬౦౦)సుప్రసిద్ధమైనది. సాంఖ్యమునకును, ఆస్తిక వేదాంతమునకును భేదములను జాలవరకుఁ దగ్గించుట కీతఁడు ప్రయత్నించెను. ఈతని దృష్టిలో నద్వైతవేదాంత మాస్తిక వేదాంతవిరుద్ధము. విజ్ఞానభిక్షు వింకను సాంఖ్యసారము ౨ యోగవార్తికము, యోగసారసంగ్రహము, విజ్ఞానామృత మను బ్రహ్మసూత్ర భాష్యమును రచించెను.

---

౧) గుణరత్నుఁడు (క్రీ. వె. ౧౪-వ శతాబ్దము) దీనిని స్మరించియుండలేదు. మఱియు దానిపై భాష్యము క్రీ. వె. ౧౬-వ శతాబ్దములో వెలువడినది. సూత్రము పూర్వగ్రంథమైనచో నేల దానిపై భాష్యమొకటి పూర్వవిరచితము కాలేదను విషయము దురూహ్యమగును. అది యితరతత్త్వము లన్నిటిని స్మరించినది. వాచస్పతి కది తెలియదు. ౧౧-వ శతాబ్ది ప్రథమభాగములోఁ దన గ్రంథమును రచించిన అల్బెరూని, యీశ్వరకృష్ణ గౌడపాదుల గ్రంథపరిచయమును జూపెను గాని, సూత్రపరిచయ మాత నికి లేదు.

౨) గోల్బు గార్బే: "ముఖ్యముగా, సూత్రకర్త, యీశ్వరవాదము ఏక బ్రహ్మ సిద్ధాంతము, బ్రహ్మానందస్వరూప విషయము, బ్రహ్మలోకప్రాప్తివాదము మున్నగువానికి సాంఖ్యతత్త్వము సంపూర్ణవిరుద్ధముకాదని రుజువు, చేయుటకు వ్యర్థప్రయత్నము చేసి నాఁడు. (చూ: ౧, ౫౩, ౧౫౪, ౫౬౪౮ ౬౭, ౧౧౦; ౬, ౫౧, ౫౭, ౫౯) సాంఖ్య సూత్రము వేదాంతసంపర్కము గలిగిన ఫలితములను స్పష్టముగాఁ జూపుచున్నది, ౪, ౩ సూత్రము వేదాంత సూత్రము ౪, ౧, ౧౧ తోఁ బ్రతిమాటలోను సరిపోవును. ౫, ౧౧౬, లో వేదాంతశబ్దము బ్రహ్మరూపతయనియే వాడఁబడినది" గార్బే ప్రకటించిన సాం॥ ప్ర॥ భా॥ పు ౧౧.

## ౪—కారణధర్మము

ప్రకృతిపురుషుల ద్వైతమును నిర్ణయించిన సాంఖ్యతత్త్వము యొక్క హేతువాదమును మనము పరిశీలింపవలసియున్నది. కారణ ధర్మము ననుసరించి ప్రకృతి యున్నదని సాంఖ్యము స్థాపించినది.

కార్యము దాని కారణమందుఁ బూర్వమే యుండు ననునది సాంఖ్య తత్త్వ ప్రధాన సూత్రములలో నొకటై యున్నది. కార్యము సూక్ష్మ రూపములోఁ గలిగియుండునదే కారణమని సాంఖ్యము నిర్వచించి, దానిని సమర్థించుట కీ దిగువ చెప్పిన యాధారములను జూపెను.[౧] (౧) లేని దెట్టి ప్రవృత్తికిని విషయము కాఁజాలదు. గగనకుసుమ ముత్పత్తి కాదు. లేని దెన్నఁడు నుండఁ జాలదు. వేయిమంది చిత్రకారులైనను నీలిమనుండి పసిమిరంగును సృజింపలేరు.[౨] ఒకద్రవ్యము తదాధార భూతమైన పదార్థమునుండి వేఱుకాదు. (౩) ద్రవ్యరూపము దాల్చుటకుఁ బూర్వము పదార్థరూపములో నది యున్నది. దీని నంగీకరింప కున్నచో, నేది దేనినుండియైన నుదయింపవచ్చును. (౪) దేనికిశక్తి యున్నదో దానికే కారణ సామర్థ్య మున్నది.(౫)కార్యము కారణ తుల్య స్వభావముగలదే. స్వభావముచే వస్త్రము దారములకు వేఱైనదికాదు.

అన్యోన్యము భిన్నములైన ద్రవ్యములకుఁ గారణ సంబంధ ముండజాలదు.[౩] వికాసమనగా నదివఱకే సూక్ష్మరూపముగా నున్నది లేక అంతర్నిహితమై యున్నదే, యావిష్కృత మగుట లేక అరిస్టోటల్ మాటలలో, నవ్యక్తమైనది వ్యక్తమగుట; హెగెల్ భాషలో నస్ఫుట ముగానున్నది ప్రస్ఫుట మగుట. దీనికి శాస్త్రాధారము గలదు.[౪] ఈ సత్కార్యవాద సిద్ధాంతము ననుసరించి, కార్యకారణము లొకే వస్తువు యొక్క వ్యక్తావ్యక్తరూపములు. ఉత్పత్తి యనఁగా నుద్భావమును,

---

౧) సాం. కా ౯.

౨) నహినీలమ్ శిల్పిసహస్రేణాపి పీతంకర్తుం శక్యతే. (తత్త్వకౌముది. పు.౯)

౩) చూ. తత్త్వకౌముది. పు. ౯.

౪) ఛాం. ఉ. ౬. ౨, ౨: భగవద్గీత, ౨, ౧౬.

నాశన మనఁగా అనుద్భావము లేక కారణరూపములోని కదృశ్యమగుటఁ. సంపూర్ణ నాశన మనునదిలేదు. భూతభవిష్యదవస్థలు నశింపలేదు; యోగులు వానిని దర్శింపఁగలరు.౨. ఆవిర్భావ తిరోభావ సిద్ధాంతమును సాంఖ్య మంగీకరించును.

కారణకార్యములు భిన్నదశలు, కావున నొక దానికొకటి వేఱై నవి; ౩ కాని యీ భిన్నత మన వ్యావహారికావసరములచేఁ జూపట్టునది. ఘట ముదకమును భరించునుగాని, మృత్తిక కాదు. ఉపాదానకారణ మును, కార్యమును మూలములో నొకటియైనను, నవి వ్యవహారములో భిన్నప్రయోజనముల నిచ్చునుగావున భిన్నములు. మూలములో నేక త్వము, వ్యవహారములో భిన్నత్వమును గలవు. సాంఖ్యము ననుస రించి కారణములు రెండు రకములు. సూక్ష్మస్థూల కారణములు; స్థూల కారణము కార్యమం దుండును; సూక్ష్మకారణము బాహ్యమునుండి తన ప్రభావమును జూపును. కార్యము కారణములో నున్నను కారణస్థితి నుండి దాని నావిష్కరించుట కింకొక శక్తి యవసరము. నువ్వులను మర్దించినఁగాని నూనె రాదు; ధాన్యమును దంచినఁగాని బియ్యము రావు. సహకారశక్తి లోపించినయెడలఁ గార్య ముత్పత్తి కాదు. ౪. కార్యము కారణమందు సూక్ష్మరూపములోనున్నను, నది వెంటనే యావిష్కృతము కాదు. అవ్యక్తమైనది వ్యక్త మగుటకు గల యవరోధములను దొలఁ

---

౧) సాం. ప్ర. సూ. ౧, ౧౨౦-౧.

౨) సాం. ప్ర. సూ. ౧, ౧౨౧.

౩) కారణకార్య విభాగాత్. (సాం. కా. ౧౫.)

౪) ఈసహకార కారణములనుగూర్చి వ్యాసుఁ డుదాహరణముల నిచ్చి యున్నాఁడు: "పెక్కు పొలములున్న యజమాని, యిదివరకే నీటితో నిండియున్న యొకపొలమునుండి నీటి నితరక్షేత్రములకుఁ బ్రవహింపఁ జేయఁగలఁడు. ప్రతిక్షేత్రమునకు మొదటినూర నుండి నీటిని దే నవసరములేదు. పొలములోని మొక్కలన్నిటికి నీటి నొకే వ్యక్తి తీసికొని పో నవసరములేదు. నీటికాలువలో నడ్డుగానున్న మట్టిని, పొలములో నాటంకముగా నున్న కలుపును దొలఁగించుటచే జలము తన సహజశక్తిచే నన్ని పరిమొక్కల ప్రేళ్ళ కును బ్రవహించును. ఉపాదానకారణములకు సహకార మొనర్చు నిమిత్తకారణ వ్యాపార మిట్లుండును." (యోగభాష్యము, ౪, ౩)

గించునదే సహకారశక్తి. ఈ సహకారశక్తులు, దేశము, కాలము, రూపములేక ద్రవ్యాకార ౧. విశేషము నని వ్యాసుఁడు వచించెను. ఒక శిలనుండి మొలక బయలుదేరదు.౨. కార్యములు రెండువిధములు, పాల నుండి వెన్నతీయుట సామాన్యకార్యము, సువర్ణమునుండి యొక యాభరణముచేయుట, పదార్థమంతయు నూతనాకృతి వహించుట. ఒక వస్తుగుణము మారినచో ధర్మపరిణామ మగును. సూక్ష్మరూపము స్థూలముగా నావిష్కృతమగుట కేవలబాహ్యలక్షణ పరిణామము. కాలము వలన వస్తువులోఁ గలుగు మార్పును అవస్థాపరిణామ మందురు.౩. సర్వ దేశములందు సర్వకాలములందు మార్పు జరుగుచునే యున్నది. ఒకే ప్రవాహములో మనము రెండు సారులు ప్రవేశింపలేము; ఏలన నందలి యుదకము రెండు క్షణములలో నొకటి కాదు.౪. అదేవిధముగా నొకే వ్యక్తి రెండుసారులు ప్రవాహములోఁ బాదము నుంచలేఁడు; ఏలన నొక క్షణ ములోని వ్యక్తి రెండవ క్షణములో మాఱినాఁడు. బాహ్యాభ్యంతరములైన సర్వద్రవ్యావస్థలు నీ పరిణామ నియతికి వశములై యున్నవి. పరిణామ విధానము ననుసరించి, పూర్వోత్తరసంబంధముచేఁ గారణధర్మమును ౫. మానవమానసము కల్పించినది.

## ౫—ప్రకృతి

నిత్యపరిణామశీల మగు ననంతవిషయ సంపుటియైన ప్రకృతి స్వరూపమున కర్థము చెప్పుటకు సాంఖ్యము యత్నించినది. అనంత

---

౧. యోగభాష్యము ౩, ౧౪.

౨. సాంఖ్యతత్త్వము ననుసరించి, సకలవస్తువులును ప్రకృతిభిన్నరూపములే కావున, నొక కార్యమున కాటంకములుగా నున్నవానినిఁ దొలఁగింపఁ గలిగినచో, నేకార్యమేకార్యముచేనైన నుదయింపవచ్చును. ఒక శిలలోని యణువులొక మొలక యందుండి పుట్టుట కాటంకములని తోఁచినచో, దైవ సంకల్పముచే నట్టియాటంకములు తొలఁగఁ గలవు.

౩) యోగభాష్యము, ౩, ౧౩.

౪) సాం॥ ప్ర॥ సూ॥ ౧, ౧-౨౧.

౫) బుద్ధినిర్మాణ.

దశలలోనున్న భౌతికపదార్థ రూపములు, సూక్ష్మపదార్థ సంజాతములై, ప్రకృతి మూలస్వరూపావిష్కరణము నందుచున్నవని సాంఖ్యము చెప్పినది. సర్వకార్యములు కారణ గర్భితములై యున్నయెడల, ననవస్థాదోషము లేకుండ నుండవలె నన్నచో, నాదికారణ మొకటి యుండవలెను. కారణధర్మమునుండి, వస్తుప్రపంచమునకు మూలరూపము నాధారమునైన దవ్యక్త ప్రకృతి యుని యది వచించెను. ప్రకృత్యస్తిత్వమును సాంఖ్యకారిక యిట్లు స్థాపించెను.౧. (౧) పృథగ్వస్తువులు పరిమాణములోఁ బరిచ్ఛిన్నములు. ఏది పరిచ్ఛిన్నమో యది దానికి బాహ్యమైన వేఱొక వస్తువుపై నాధారపడును. కావున విశ్వాధారమైనది పరిచ్ఛిన్నవస్తువు కాఁజాలదు. (౨) సర్వ పృథగ్వస్తువులు వ్యాప్తిలక్షణములు గల వగుటచే నివన్నియు నొకే మూలాధారముగలవని సూచించును. భిన్నవిషయములు పరస్పరము సంపూర్ణముగా వేఱైనవని సాంఖ్యము విశ్వసింపదు (౩) ఒక ప్రవృత్తిధర్మము వస్తుపరిణామములో వ్యక్త మగుచున్నది. పరిణామధర్మము పరిణామదశలలో నే యొకదశయును గాఁజాలదు. అది వివిధదశలకు నతీతము నంతర్గతము కూడనై యున్నది. (౪) కార్యకారణములకు భేదము గలదు. అందుచేఁ బరిచ్ఛిన్నము పరాధారసహితము నగు జగత్తున కదియే కారణమని చెప్పఁజాలము. (౫) జగత్తున కేకత్వము సుస్పష్ట మగుటచేఁ దత్కారణము నేకమని సూచించును. అల్పతమరూపమునుండి యధికతమ రూపము వఱకు జగత్తులో నవిచ్ఛిన్నత గలదని సాంఖ్య విశ్వాసము. వస్తువుల యుత్పత్తియు, విలయము నొక క్రమవిశిష్టతఁ గలిగియున్నవి. ప్రపంచము తత్కారణమైన ప్రకృతియొక్క పరిణామమని చెప్పఁబడెను. ప్రతివస్తువు దాని నుత్పత్తిచేయు కారణమునకుఁ గార్యము; ఏలన శూన్యమునుండి శూన్యమే సంభవించును. కార్యమునకంటెఁ గారణమల్పమైన దైనచోఁ, గారణ ముత్పత్తిచేయని కార్యములోని భాగమును శూన్య ముత్పత్తిచేసి యుండవలెను. అందుచేఁ గారణము కార్యముకంటె నధికమో, సమానమో కావలెను. డేకార్టే మాటల నుపయోగించినచోఁ గార్యములోని యర్థమును, విలువయు యాథార్థ్యమును

---

౧) సాం॥ కా॥ ౧౫, ౧౬.

బరమకారణములో సమగ్రముగా నుండవలయునని సహజమైన హేతు జ్ఞానము వెల్లడించును. ఏది మూలరూపములో నంతర్నిహితమై లేదో యది యెన్నఁడును గార్యరూపమున నావిష్కృతము కాఁజాలదు.౧. ప్రతికార్యమున కొక కారణ మున్నను, ప్రకృతికిఁ ౨. గారణము లేదు. ప్రకృతి సర్వకార్యకారణమని కార్యములవలనఁ దెలియుచున్నది.౩. అది ప్రధాన మనఁబడును; ఏలన సర్వకార్యములు దానిపై నాధారపడి యున్నవి.౪. అది బ్రహ్మయనఁబడు, ఏలన నది పెంపొందును.౫. మాయయనఁబడు ఏలన నది పరిమాణమును నిర్ణయించును. భిన్న ద్రవ్యము లందుండి జనించును గావున నది యాదిమూర్తి యనఁబడును. ప్రకృతి లేక యనాత్మనుండి పురుషుఁడు లేక ఆత్మ సంభవించెననుట సాధ్యముకాదని సాంఖ్య నిశ్చయము.

వస్తువులు కారణజన్యములు; ప్రకృతి కారణరహితము. వస్తువులు పరాధీనములు; ప్రకృతి స్వతంత్రమైనది. వస్తువు లనేకములు; దేశకాలపరిచ్ఛిన్నములు; ప్రకృతి యేకము, సర్వవ్యాపి, నిత్యమునై నది.౬. వస్తువులు సంజ్ఞలు; వాని మూలకారణము నవి సూచించును. ప్రకృతి కెన్నఁడును నాశనము లేదు; అందుచే దానికి పుట్టుక లేదు. చేతనశక్తి అచేతన జగత్తున కుపాదాన కారణము గాఁజాలదు. ఏలనఁ

---

౧) పోల్చు: దేకార్టే చెప్పిన ముఖ్యోపాదాన కారణభేదము.

౨ సాం॥ ప్ర॥ సూ॥ ౧, ౬౩,

౩) సాం॥ ప్ర॥ సూ॥ ౧, ౧౨౦, ౧౩౬.

౪) ప్రధీయతే(సాం॥ ప్ర॥ భా॥ ౧, ౧౨౫). లోకాచార్యుఁడది సర్వపరిణామాధారము కావునఁ బ్రకృతియనియు, సర్వజ్ఞాన వ్యతిరేకము గావున నవిద్య యనియు, నానారూప సృష్టికారణము గావున మాయయనియుఁ జెప్పినాఁడు. ప్రకృతి రిత్యుచ్యతే వికారోత్పాదకత్వాత్, అవిద్యాజ్ఞాన విరోధిత్వాత్, మాయాచిత్రసృష్టికర్తృత్వాత్, (తత్త్వత్రయము పు ౪౮) సర్వభౌతిక రూపములకు నగోచరమైన మూలప్రకృతి యొకటున్నదని ప్లేటో భావించినాఁడు. చూ. టిమోరస్, పు. ౨౪.

౫) భగవద్గీత. ౧౪, ౩

౬. సాం॥ కా॥ ౧౦: సాం॥ ప్ర సూ॥ ౧, ౧౨౪: మఱియుఁ జూడు, యో॥ భా॥ ౪, ౧౨: సాం॥ ప్ర॥ భా ౧౬౬.

చైతన్య మెన్నఁడును జడపదార్థము కాఁజాలదు. పురుషునికిఁ గర్తృత్వములేదు, అహంకారమే కర్త; ఏలన నదియు నొక యుత్పత్తిగల వస్తువే. ౧.

ప్రకృతి యగోచర పదార్థమగుట ముఖ్యవిషయము కాదు. దృశ్యములు కాకున్నను, నిజము అని సువిదితములైన వస్తువు లెన్నియో గలవు. అతిసమీపాతిదూరవస్తువులు దృశ్యములు గావు. ఇంద్రియ మానసికదోషములు, ఇతరద్రవ్యావరోధము, మనము చూడవలయు వస్తువులకంటె నెక్కు డాకర్షణము గల వస్తువు లుండుటయు, మన చూపును వ్యర్థ మొనర్చును. ప్రకృతి సూక్ష్మమగుటచే నదృశ్యము.౨. వ్యాసుఁడు ప్రకృతినిట్లు వర్ణించెను. “ఏది యెల్లప్పుడు నున్నదియు లేనిదియునో, దేనియం దెన్నఁడభావత లేదో, యేది విశిష్టసంజ్ఞాహీనమో, అవ్యక్తమో, సర్వకేంద్రాధారమో అదియే ప్రకృతి.” ౩ జీవావసరముల గూర్చిన దస్తిత్వము గలదైనచోఁ బ్రకృతి లేనిదని చెప్పవలెను; కాని యీ లేకుండుట చతురస్రచక్రమువలె లేకుండుట కాదు. అస్తిత్వము గలదేదియు నశింపదు: వస్తువులు అవ్యక్తరూపములలోఁ బ్రకృతియం దున్నవి. వస్తుజగత్తంతయు దాని యందంతర్నిహితమై యున్నది. గుణములు పరస్పరవిరోధములు గావు; అవియొకసమస్థితిలో నున్నవి; అది నివృత్తికాదు; అట్లు గోచరించు సమరసప్రవృత్తి, ప్రకృతి యొక వ్యక్తి కాక శక్తి యని చెప్పవలెను. ఈ త్రిగుణ ౪. సామ్యావస్థ. భౌతిక మానసిక రూపము లన్నిటి కాధారము. అది శుద్ధసామ్యావస్థ ౫. మనకుఁ

---

౧) సాం॥ప్ర॥సూ ౬,౫౪.

౨. సాం॥ కా. ౮.

౩. విస్పష్టాసత్తం, నిస్పదసన్నిరసద్. అవ్యక్తమలింగం ప్రధానం(యో.భా.౨. ౧౯: సాం॥ ప్ర. భా, ౧, ౬౧.

౪. సామ్యావస్థా. సాం॥ ప్ర॥ భా. ౧, ౬౧.)

౫. పోల్చు రా॥ వే॥ ౧౦, ౯౨.

గలజ్ఞానము దృశ్యజ్ఞానమే ౧. యగుటచేఁ బ్రకృతియొక్కగాని, గుణములయొక్క కాని నిజస్వరూపము మనకుఁ దెలియదు. దానికి శబ్దస్పర్శలు లేవు; ౨. వీని కతీతలక్షణములు మనకు సాధ్యములు గావు. వ్యావహారికముగా నదియొక భావము లేక నామము, ౩. కాని యది సర్వసృష్టికిని బూర్వరూపమని గ్రహింపవలసి యున్నది. ౪.

ప్రపంచ మొక యేక పదార్థమునుండి జనించినదనియు, నట్టి పదార్థములోని సూక్ష్మాంశముల భిన్నసంయోగములచే భిన్నాకృతు లేర్పడిన వనియుఁ జెప్పు సాంఖ్యసిద్ధాంతమునకు భౌతికవాదమునకుఁ గొన్ని సామ్యము లున్నవి. బాహ్యస్వరూపము ననుసరించి ప్రపంచ మొక యపక్రమ వస్తుసముచ్చయమని మనకుఁ దోఁచును గాని, దాని కొక సహేతుకమైన స్వరూప మున్నదని నిరూపింపవలె నని సాంఖ్యమును భౌతికవాదమును గూడ యత్నించును. రెండు నొక మూల పదార్థమున్నదనియు నది నిత్యము నవ్యయము నభేదము ననియు విశ్వసించును. మన ప్రత్యక్షానుభవములో మనము చూచు నానా వస్తు పరంపర యొకే మూలపదార్థముపై నాధారపడియున్నదని చెప్పును. కాని, సాంఖ్యులప్రకృతి భౌతికవాదుల శుద్ధపదార్థమని చెప్పరాదు. పురుషోత్పత్తికిఁ బ్రకృతికి శక్తి లేదనియు నట్లే ప్రకృత్యుత్పత్తికిఁ బురుషునకు సామర్థ్యము లేదనియు సాంఖ్యశాస్త్ర వేత్తలు గుర్తించినారు. భౌతికవాదు లంగీకరింపరు గాని, సాంఖ్యవేత్తలు ప్రకృతి పరిణామమున కొక లక్ష్య మున్నదనియు "దాని వెనుక మన మెన్నఁ డెఱుఁగని వేఱొక ప్రపంచ కాంతిరేఖలు దానినుండి ప్రసరించుచున్న" వనియు నంగీకరింతురు. సాంఖ్యులప్రకృతి కేవల

౧. షష్టితంత్రమునుండి వ్యాసుఁడొక శ్లోకము నిట్లుదాహరించెను:
"గుణానాం పరమంరూపం న దృష్టిపాతం రోచతి॥
యత్తుదృష్టిపాతం ప్రాప్తం తన్మాయేవసుతుచ్ఛకం.
దీనిపై వాచస్పతి వ్యాఖ్య వ్రాయుచుఁ బ్రకృతి మాయ కాదు మాయవంటిదని చెప్పినాఁడు. మాయేవ న తు మాయా.

౨ సాం॥ ప్ర॥ భా॥ ౧. ౧౨౭: విష్ణుపురాణము. ౧, ౨. ౨౧-౨౧

౩. సంజ్ఞామాత్రమ్. (సాం॥ ప్ర॥ భా॥ ౧,౬౮)

౪. ప్ర=పూర్వము, కృతి=సృష్టి లేక ప్ర=అధికముగా, కృతి=చేత.

మొక విశ్వవ్యాప్తమగు పదార్థముకాదు; అది యొక చేతన వ్యక్తియును గాదు; ఏలన, పురుషుఁడు ప్రకృతికి వేరని వారు చెప్పుదురు. ప్రకృతి నుండి పంచస్థూలభూతములును జనించుటేకాక, సూక్ష్మములైన మానస రూపము లన్నియు నందుండి జనించుచున్నవి. బాహ్యప్రపంచస్థితి కంతకు నదియే మూలాధారము. సాంఖ్య మిట్టి సిద్ధాంతమును భౌతికశాస్త్ర పద్ధతిచే నిర్ణయింపలేదు: తాత్త్వికపద్ధతిచేతనే యీ నిర్ణయమును జేసి నది. పరిపూర్ణమైన యథార్థస్వరూపము నెన్నఁడు మార్పులేని ద్రష్టగాను, నిత్యమును మార్పుగల దృశ్యముగాను సాంఖ్యము విభాగించెను. అ దృశ్య భాగమునకే ప్రకృతి మూలమైనది. నిరంతరప్రవృత్తి మయ స్వరూపమైన జగద్వ్యాపారమునకు సంజ్ఞారూపమే ప్రకృతి. ప్రకృతి తనకుఁ దెలియకుండఁగనే, సునిశ్చితలక్ష్యము నూహింపకుండగనే, యొక మహాప్రయోజనముకొఱకు నిత్యము క్రియాపరతంత్రమై నడచు చున్నది.

## ౬ – గుణములు.

ప్రకృతిపరిణామము తద్గర్భితమైయున్న గుణత్రయము వలన జరుగును.౧, ప్రకృతికార్యక్రమములనుబట్టి గుణత్రయాస్తిత్వ మూహింపఁ బడినది; కార్యమైన బుద్ధికి సుఖదుఃఖ విస్మయగుణము లున్నవి కావున దానికారణ మైనప్రకృతి కట్టి గుణము లుండియుండవలెను. గుణములు దృశ్యవిషయములు గావు; వాని కార్యములవలన నవి యున్నవని మనము గ్రహించితిమి. సత్త్వము మొదటి గుణము. అది యాంత రంగికచైతన్యము. మానవునికి సుఖానుభవరూపమున నావిష్కృత మగును. సత్త్వశబ్దము 'సత్' అనఁగా 'నున్నది' యను పదము నుండి వచ్చినది. చైతన్యమున కట్టి శక్తి కలదని చెప్పుదురు. 'సత్' అనగాఁ బరిపూర్ణతయనియు నింకొక యర్థము; దీనివలన సుఖశ్రేయ ములను గలిగించునది సత్త్వమనియుఁ జెప్పుదురు. సత్త్వము ప్రకాశ కత్వముగలది.౨. రెండవదైన రజస్సు సర్వప్రవృత్తి...

౧) సాం॥ కా॥ ౧౬, ౨) సుఖప్రకాశలాఘవ...



క్లేశమూలము నైనది. అత్యుత్కట సుఖానుభూతియు విశ్రాంతి లేని ప్రయత్నమును ౧. రజస్సు లక్షణములు, మూఁడవది తమస్సు; ప్రవృత్తి కవరోధమై, మాంద్యమును గల్గించునది; దీనివలన నజ్ఞానాలసత్వములు గల్గును. క్రమముగా సత్త్వ రజస్తమోగుణములకుఁ బ్రకాశ ప్రవృత్తి నియమములు ౨. లక్షణములై సుఖదుఃఖమాంద్య హేతువు లగును. ఇవి పరస్పర సంపర్కముగలిగి, పరస్పర పోషకములై యుండును. ఈ మూఁడుగుణములును విడిగా నెన్నఁడు నుండవు. అవి దీపశిఖ, వత్తి, నూనెవలెఁ గలిసియుండును. ౩. అవి ప్రకృతిలోని ప్రధానద్రవ్యములు, సర్వవస్తువులు గుణత్రయకల్పితములై యున్నవి. ౪ వస్తుభేదమునకుఁ గారణ మొక్క గుణముయొక్క యుత్కర్షయే. ఈ గుణత్రయభావము మానసికావస్థా పరిశీలనాఫలితమే; అనుభవభేదమును బట్టి గుణభేద మేర్పడినది. సాంఖ్యకారికయొక్క కాలమునందే, యీ గుణములు ప్రకృతియొక్క ముఖ్యాంగములుగా గ్రహింపఁబడినవి. ౫. అవి గుణము లనుటకుఁ గారణము ప్రకృతియొక్కటే ద్రవ్యము; గుణము లందలి లక్షణములు, ఏ యొక ద్రవ్యపరిణామమునందైనను గుణములు భిన్నావస్థలను దెల్పునవిగా గ్రహింపనగును. పొందవలసిన రూపమును

---

౧. దుఃఖోపష్టంభకత్వ, ప్రవర్తకత్వములు: తమస్సు మోహాగురుత్వావరణైః॥ (తత్త్వకౌముది పు ౧౩.)

౨. ప్రకాశక్రియాస్థితి శీలమ్। (వై॥ సూ॥ ౨, ౧౮)

౩. సాం॥ కా॥ ౧౩.

౪. త్రిగుణాత్మకమ్॥

౫ పోల్చు. శ్వే. ఆ ఉ. ౪, ౫. "అజామేకాంలోహిత శుక్ల కృష్ణాం" ఛాం. ఉపనిషత్తులోఁ జెప్పఁబడిన మూఁడురంగుల నిది స్మరించునని శంకరుఁడు చెప్పినాఁడు సాంఖ్యవాది దీని కిట్లర్థము చెప్పునని శంకరుఁడిట్లు వ్రాసెను: ఈశ్లోకములోని లోహితశుక్లకృష్ణము లనగా రజస్సత్త్వతమములు, లోహితము రజస్సు: ఏలన నది యెరుపుదనమును గలిగించి, అశాంతహేతువై రంజింపఁజేయును. శుక్లము సత్వము: ఏలన నది స్వచ్ఛత నిచ్చును. కృష్ణము తమస్సు: ఏలన నది చీఁకటిని గలుగఁజేయును. ఈ మూఁడును మూల ప్రకృతి గుణములు గావున నవి. అజములు, పుట్టుక లేనివి" గుణములనుటకుఁ. గారణమని యాత్మను బంధించునవి. గుణమనఁగా రజ్జువు. (సాం॥ ప్ర॥ భా॥ ౧, ౬౧)

సత్త్వమును, దానిని సాధించుటకుఁగల యాటంకములను దమస్సును, వానినిఁ దొలఁగించు శక్తిని రజస్సును దెల్పుచు రూపసిద్ధిహేతువు లగును. సాంఖ్యసత్కార్య సిద్ధాంతము ననుసరించి యొక వస్తు వెన్నఁడును సృజింపఁబడదు. ఆవిష్కృతినే పొందును. వస్తూత్పత్తి యనఁగా నావిష్కృతియు, వస్తు వినాశమనఁగా ననావిష్కృతియు నని యర్థము. ఆవిష్కృత్య నావిష్కృతులు రెండును నిరోధకశక్తులుండుట లేకుండుటపై నాధారపడి యుండును. ఆటంకములు లేనపు డొక వస్తు వావిష్కృతి నొందును. ఒక వస్తువుయొక్క సత్త్వము లేక రూప మావిష్కృతి నొందును. రజ స్సావిష్కృతి సాధనము; సత్త్వావిష్కృతి నిరోధకము తమస్సు ౧. సత్త్వతమస్సులు భావాభావాత్మకము లైనచో రెండింటికిఁగల సంఘర్షణముయొక్క రూపమైనదే రజస్సు. ప్రతివస్తువునకు లక్ష్యరూప మున్నది; ప్రస్తుతావస్థ దాని కొటంకమై తొలఁగింపవలసి యున్నది. మొదటిది సాత్త్వికావస్థయు రెండవది తామసికావస్థయు నై యున్నది. విజ్ఞానమునకు గోచరమగు రూపమును బొందుట సత్త్వముయొక్క ఆశయము. సర్వమునకు నీ లక్షణములున్నవి. కావున నివి ప్రకృతిలక్షణము అని పరిగణింపఁబడినవి. ౨.

---

౧. డాక్టరు సీల్ ఇట్లు వ్రాసెను: "ప్రతి దృశ్యమునకు నాధారము త్రిగుణాత్మకము; మూలచైతన్యము, శక్తి, స్థూలరూపము. ఇవి కలిసి సర్వవస్తువులను గల్పించును ఒక వస్తువుయొక్క సత్త్వము దానిని బుద్ధిగోచరరూప మొనర్చును. సమష్టి బుద్ధిగోచరము కాని దేదియును లేదు. కాని యిది గుణత్రయములో నొకటి. దీనికి స్థూలత కాని, నిరోధకశక్తిగాని, క్రియాశక్తిగాని లేదు. రెండవది తమస్సు: ఇది జడపదార్థము: చలనమునకును, బుద్ధిప్రవృత్తికి నిరోధకమును, కాని చైతన్యమును, జడపదార్థమును క్రియాశక్తిగలవి కావు, రజస్సే పనియంతయును సేయునది: అవరోధములఁ దొలఁగించి, బుద్ధిలేక చైతన్యము తన కార్యములను నెరవేర్చుశక్తి నిది యిచ్చును. (ది పోజిటివ్ సైన్సెస్ ఆఫ్ ది హిందూస్, పు ౪.) ఈ యర్థవివరణములో సీల్ పండితుఁడు సాంఖ్య సిద్ధాంతమును వివరించుటకు బదులు సవరించుచున్నట్లు దోఁచును.

౨) సర్వజగత్తునకు లక్షణమైన ప్రవృత్తికి దానిని నిరోధించుశక్తి వేరొకటి లేకున్నచో నర్థములేదని చెప్పఁబడెను. అందుచే రజస్సులేక ప్రవృత్తి తమస్సు లేక మాంద్యమును సూచించును. తమస్సు లేనిచో సర్వవస్తువులు నిత్యక్రియా గ్రస్తము లగును. క్రియాశక్తివలన యోగ్యకాంక్షాసిద్ధి యున్నది. కావున నందు సత్త్వమును నున్నది. (తత్త్వకౌముది పు ౧౩)

సాంఖ్యగుణములు వైశేషికగుణములు కావు; వీనికి లఘుత్వము, ప్రవృత్తిమున్నగు లక్షణము లున్నవి.౧. విజ్ఞానభిక్షువు వీనిని సత్త్వ రూపములనియు.౨. భౌతిక మానసికదోషముల నుదయింపఁజేయు నాంతరంగిక ప్రవృత్తులని ప్రాచీనోపనిషత్తు౩. లను భావించెను. నిర్వాణములో నీగుణము లతి సూక్ష్మము లని చెప్పఁబడెను. అవి నిత్యపరివర్తనశీలములు. సామ్యావస్థలోనైనను, నవి పరస్పరసంక్రమణము నొందుచున్నవి.౪. సామ్యావస్థ చెడకుండునంత కాల మీ మార్పులవలన వస్తుజగత్తులోఁ గార్యోత్పత్తి లేదు. సామ్యస్థితికి విపర్యయ మేర్పడినప్పుడు గుణక్షోభమువలన నన్యోన్యసంఘర్షణ ఫలితముగాఁ బరిణామ మారంభమగును. గుణముల పరస్పరవ్యాపార సంఘర్షణమువలన జగద్రూపవైవిధ్య ముదయించుచున్నది. ఏ గుణ మే రూపమున నతిశయస్వభావము చూపునో యా రూపమున కా గుణాకృతి లభించును గాని, యితర గుణములందు లేదని తలఁపరాదు. స్థాణువులైన జడపదార్థములలోఁ దమోగుణ మతిశయలక్షణమై యున్నది. సత్త్వరజోగుణము లప్రధానములుగా నున్నవి. చలనముగల వస్తువులలో రజోగుణ మతిశయమై, యితరగుణము లణఁగియున్నవి. కావున సత్త్వరజస్తమోగుణము లని చెప్పినపుడు వానిని విడిగానున్న గుణములని యర్థము తీసికొనరాదు; దేనియం దే గుణ మతిశయముగా నున్నదో దాని కా గుణము చెప్పఁబడెనని గ్రహింపవలెను. ఈ గుణములు పరస్పరసహకారముచేఁ గార్యజగత్తు నుదయింపఁ జేయుచున్నను, నవి పరస్పరము సంయోగము నొందవు. ఒక గుణముపై నొక గుణప్రభావము వలనఁగాని సాన్నిధ్యమువలనఁగాని యవి మార్పునొందుచుండును. అవి పెంపొంది, కలిసి, విడిపోవుచుండును. ఇతర గుణములు తీవ్రముగాఁ బనిచేయుచున్నను నేగుణముగాని తనసహజలక్షణమును గోల్పోవదు౫. ప్రకృతియు దానినుండి

---

౧) సాం॥ ప్ర॥ భా॥ ౧, ౬౧.

౨) వాచస్పతియు సాంఖ్యకారికయు నీ యర్థమును జెప్పవు.

౩) శ్వేతాశ్వతర మైత్రాయణ్యుపనిషత్తులు.

౪) సారూపపరిణామము.

౫) యో॥ భా॥ ౧, ౧౨౮.

జనించిన సకలమునకు నీ గుణము లున్నవి; అందుచే నవి విజ్ఞానహీన ములై యున్నవి. ఈ గుణములు తమలోఁ దమకుఁ గల భేదములను గాని, తమకుఁ బురుషునకుఁ గల భేదమునుగాని తెలియుశక్తి లేనివి. ఇవన్నియు దృశ్యములే; పురుషుఁ డొక్కఁడే ద్రష్ట.

విజ్ఞానభిక్షు వీ గుణములనుగూర్చి వేఱొక భావమును జెప్పినాఁడు. అవి వ్యక్తుల నానాత్వము ననుసరించి, అనంతము లనియు సూక్ష్మ తత్త్వము లనియు నాతని భావము. ఈతని వాదము ననుసరించి, సర్వ సామాన్యము లైన యీ గుణములు భిన్నసంయోగములచే భిన్నకార్య ముల యుత్పత్తికి హేతువు లగుచున్నవనుట సమంజసము కాదు. ఏలనఁ గొన్ని స్వల్పభేదముల ౧. కివి హేతువులను జూపఁజాలవు. గుణముల రూపము లనంతము లైనను, వాని కన్నిఁటికినిగల సామాన్యలక్షణ ములచే లఘుత్వము మున్నగునవి– మూఁడువర్గములుగా విభజింపఁ బడినవి.–౨. సత్త్వాదులైన మూఁడు కారణ ద్రవ్యములలోఁ బ్రతిగుణము నకు ననేకవిశిష్టరూపము లున్నవి. ౩. గుణములకు సృష్టి లయములు లేవు. సూక్ష్మవస్తునుండి స్థూలాకృతి నొందుదశలో వివిధసంపర్క పరి వర్తనములచే వృద్ధిక్షయములు, అల్పత్వా నల్పత్వములు బాహ్యదృశ్య రూపముల కున్నను, ఆవిష్కృతా నావిష్కృతముల మొత్త మెన్నఁ డును సమానముగా నే యుండును. ఇది యంతయు ద్యూతక్రీడలోపలెనే జరుగును; పాచిక లన్నియు మార్పు లేనివే యైనను, నవి పడుస్థాన ముల ననుసరించి వానికి భిన్నార్థములు గలిగిన వగును. మార్పు లన్నియు స్థానము, క్రమము, వర్గము, సంయోగ వియోగములలోనే చూపట్టును; నిత్య స్థితిగల మూలద్రవ్యము లెల్లప్పుడును గలసి విడి పోవుచుండును.౪.

---

౧) సాం॥ ప్ర॥ భా॥ ౧.౧౨౭.

౨ సాం॥ ప్ర॥ భా॥ ౧.౧౨౮.

౩) సాం॥ ప్ర॥ భా॥ ౧,౧౨౯.

౪) తత్త్వకౌముది. పుటలు ౧౩–౧౬: తత్త్వవైశారది ౨, ౨౦; ౪, ౧౩–౧౪: యోగవార్తికము ౪,౧౩–౧౪.

## ౩—పరిణామము

ప్రకృతి మూలద్రవ్యము; దానినుండియే జగ మంతయు నుత్పన్నమైనది. వ్యక్తస్వరూపములోఁ బ్రకృతి యనఁగా వ్యతిరేకశక్తుల సంయోగము మాత్రమే. సామ్యావస్థలో నన్నియు సంబద్ధములై యున్నప్పుడు ప్రవృత్తి లేదు. నివృత్తియే ప్రకృతియొక్క సహజావస్థ.౧ బాహ్యప్రవృత్తి లేకుండుటనఁగా, క్రియాశక్తిలోప మని తలఁపరాదు. ఆవిష్కరణలక్షణము లేక సత్త్వము; ప్రవృత్తి లేక రజస్సును, ఆవిష్కృతినిరోధకము, ప్రవృత్తిరహితము నగు తమస్సుచే నెదుర్కొనఁ బడినవి. వ్యతిరేకశక్తుల సామరస్యమే ప్రపంచ మను మహోన్నత సూత్రమును సాంఖ్యము మనకుఁ బ్రకటించినది. ఏకము నభేదమునైన దెదియైన నెల్లప్పుడును ప్రవృత్తి పరతంత్రమైనఁ గావలయును లేదా నిత్యక్రియాశూన్యమైనఁ గావలెను. ప్రకృతి సహజముగా సంఘర్షణము గలది కాదు; అందుచేఁ దప్పనిసరిగా నందు భేదమేయుండనవసరము లేదు. ౨. గుణసామ్యస్థితికి సంక్షోభము కలిగినపుడు, ప్రకృతికిఁ బ్రళయము ౩. సంభవించి, యొక గుణమతిశయభారమై పట్టుదప్పి, పరిణామ మారంభ మగును. పురుష ప్రభావముచేఁ బ్రకృతి పరిణామ మందును. పురుషుని యర్థసిద్ధికొఱకై త్రిగుణాత్మక విశిష్టరూపములోఁ బ్రకృత్యావిష్కరణము జరుగును.౪. ప్రకృతి యేకము, సర్వవ్యాపియును గావున సర్వవస్తువుల కదియే యాధారము; ఒక విధముగాఁ జూచినచో, సర్వవస్తువులకు సమానలక్షణము లుండవలెను. కాని, వస్తువు లన్నియుఁ దమలక్షణముల నొకేసారి ప్రదర్శింపవు. దేశకాలనిమిత్తముల ననుసరించి, సర్వవస్తుపరిణామ మొక నియతసూత్రప్రకారము జరుగుచుం

---

౧) యోగభాష్యము ౨, ౧౯.

౨) చూ: స్పెన్సర్: ఫస్ట్ ప్రిన్సిపల్స్: పు. ౧౫౫.

౩) ప్రకృతినాశము.

౪) త్రిగుణానాం వ్యవస్థావిశేషాణా మాదౌ పురుషార్థతాకారణం భవతి (యో: భా॥ ౨, ౧౯) దీనిపై వాచస్పతి భాష్యమునుగూడఁ జూడుఁడు.

డును ౧. ఈ పరిణామ మెందు కిట్లు జరుగునో మనకుఁ దెలియదు. ఉన్నస్థితిని మనము గ్రహించవలెను. సర్వవస్తుబీజ నిలయమగు ప్రకృతినుండి విజ్ఞానస్వరూపములు, వాని విషయములు నావిష్కృతము లగుచున్నవి.

ప్రకృతి పరిణామములోఁ బ్రథమోత్పత్తి గాంచినది మహత్తు. ఇది జీవియొక్కబుద్ధి కాధారము. మహత్తు సమష్టి బుద్ధిస్వరూపము; వ్యక్తిగతముగా దానినే బుద్ధియందురు. బుద్ధిశబ్ద పర్యాయపదముల ననుసరించి, ధర్మజ్ఞాన వైరాగ్యైశ్వర్యములు వీనివ్యతిరేకములు బుద్ధి లక్షణములుగాఁ జెప్పఁబడుటచే మనస్సంబంధార్థమే దీనికి నిర్ణయింపఁ బడినట్లు తోఁచును ౨. కాని మహచ్ఛబ్ద పర్యాయములుగా బ్రహ్మమున్నగు పదము లుండుటచే దీనికి సమష్టిస్వరూపార్థమును యుక్తమే యని తోఁచును ౩. బుద్ధి యనఁగా నశరీరి యైన పురుషునిఁగా భావింపరాదు. సర్వ మానసిక వ్యాపారముల కాధారమైన సూక్ష్మశక్తియే బుద్ధి. వస్తు వివేకము బుద్ధివలన మనకుఁ గలుగును. బుద్ధినిశ్చయజ్ఞాననిర్ణయము చేయును. తక్కిన యింద్రియము లన్నియు బుద్ధివశములై పని చేయును. బుద్ధి యొక్కటే పురుషవశమై వర్తించును. పురుషుఁడు బుద్ధిసహకారముచే సర్వానుభవములను గలిగి, తనకును బ్రకృతికినిగల భేదమును గుర్తించును.

ప్రకృతిసంభూతములైన యితరవస్తువులవలెనే బుద్ధియు త్రిగుణాత్మకము. సాత్త్వికబుద్ధికి విధి నిర్వహణము, జ్ఞానము, రాగద్వేష శూన్యతయు నితర దైవగుణసంపత్తియుఁ గలవు; రాజసబుద్ధికిఁ గామములు లక్షణములు; తామసబుద్ధి కజ్ఞానాల సత్వములు గుణములు. సర్వజీవు లీశ్వర ౪. స్వరూపము లనియు రజస్తమోగుణములు జీవుల స్వతస్సిద్ధమైన యీశ్వరత్వమును మఱుగుపఱచుచున్నవనియు విజ్ఞాన

---

౧) పరిణామక్రమ నియమము.

౨) మతి, ఖ్యాతి ప్రజ్ఞా, జ్ఞానమ్॥

౩) అనంతర వేదాంతమందు సమష్టిబుద్ధి హిరణ్యగర్భుని యుపాధిగాఁ గైకొనఁబడెను.

౪) సర్వ ఏవ పురుష ఈశ్వర ఇతి.

భిక్షువు చెప్పినాఁడు ౧. భూత సృష్టియు బుద్ధిసృష్టియు వేఱు, విపర్యయము, అశక్తి, తుష్టి, సిద్ధియు బుద్ధిరూపములు. వీని కేబది రూపము లున్నవి ౨. అవిద్యాఽస్మితాదు లగు నజ్ఞానరూపము లైదు; వీనిలో నొక్కొక్కదాని కెనిమిది రూపము లున్నవి. రాగము పదిరక ములు; ద్వేషాభినివేశము లొక్కొక్కటియుఁ బదునెనిమిది తెఱఁగులు. అశక్తి యిరువదియెనిమిదిరూపములు గలది; నవరూపకము తుష్టి; అష్టవిధము సిద్ధి.

బుద్ధి నిత్యానిత్యము. ఇది ప్రకృతిలో బీజాకృతి వహించి అవ్యక్తమైయున్నది. అది కారణరూపమునుండి కార్యరూపము దాల్చి నపుడు బుద్ధి యనఁబడును. బుద్ధి అవ్యయము, సర్వ సంస్కార ౩. గర్భితము నని విజ్ఞానభిక్షువు చెప్పినాఁడు. స్మృతి బుద్ధిగతమే కాని మనస్సునకుఁగాని యహంకారమునకుఁ గాని చెందినది కాదు. "పర మార్థజ్ఞానసిద్ధి" వలనఁ జిత్తాహంకారములు విలయ మందినను, స్మృతి నిలిచి యుండును. ౪.

మనస్సు అహంకారము, ఇంద్రియములు వీనికి పూర్వమే బుద్ధి యున్నచో, ఏకారిక చెప్పినరీతిని బుద్ధి తన విధులను నిర్వర్తింపఁ గలదు? కాని వీని కన్నిటికిఁ బూర్వమే బుద్ధియున్నదని సాంఖ్యము చెప్పుచున్నది. అందువలన సర్వద్రష్టృదృశ్యభేదముల కాధారభూత మైన సమష్టిశక్తియే బుద్ధి యని గ్రహింపవలెను. కాని మన మూహిం చిన విశ్వైకశక్తిని సాంఖ్య మంగీకరింపదు. అందుచే మహత్తు లేక బుద్ధియొక్క పదవి సందిగ్ధమైనది. ప్రకృతి సంభూతము, అహంకార జనకము నగు బుద్ధి వేఱు; ఇంద్రియమనోఽహంకార వ్యాపారములను నడిపించుబుద్ధి వేఱు. రెండు నొకటియైనచోఁ బ్రకృతి పరిణామమం తయు వాస్తవికత లేనిదే యగును; ఏలన, అహంకారమును నిరహం

---

౧) సాం॥ ప్ర॥ భా॥ ౨,౧౯. మఱియుఁ జూడుఁ: యో॥ భా॥ ౧,౨

౨) సాం॥ కా॥ ౪౬.

౩) సాం॥ ప్ర॥ భా॥ ౨,౪౦-౪౨.

౪. సాం॥ ప్ర॥ భా॥ ౨,౪౨.

